ధ్యానించి యథావిధి నర్చనంబు గావించి పాత్రాసాదనంబు చేసి యన్నంబును భక్ష్యభోజ్యశాకలేహ్యసూపాదులును వడ్డించి యభిఘారంబు గావించె. 2340

ఆ. అంత నతిథి యిట్టు నట్టును జూచుచు, రామ శీఘ్రముగను బ్రణతి సేయు
మాఁగఁజాల నింక నాఁకలి మెండయ్యె, నాజ్ఞ యైన నిపుడె యారగింతు.

క. అనుటయు రాముఁడు వినయం, బున మ్రొక్కి మహాత్మ శీఘ్రముగఁ బైకార్యం
బును నడపెదఁ ద్వరపడకుము, కనికరమున ననుచు వేఁడి గ్రక్కున నంతన్.

వ. కర్మకలాపం బంతయు యథాక్రమంబుగా జరిపి యాపోశనంబు నర్పించె. అంతట బ్రాహ్మణులు యథాసుఖంబుగా భుజించుచుండ ఋత్విజులు రక్షోఘ్న మంత్రపఠనంబు గావింపం దొడంగిరి. 2343

ఆ. అప్పు డతిథి యైనయవనిబృందారకుఁ, డాత్మపాత్రగతపదార్థ మెల్లఁ
గలిపి యొక్కముద్దగా గుటుక్కున మ్రింగి, యందఱకును గూడ నచ్చెరువుగ.

ఆ. రామ నాకు నొక్కప్రాణాహుతికిఁ గూడఁ, జాల దీవు నేఁడు సలిపినట్టి
శ్రాద్ధయత్న మెల్ల శక్తి లేకుండిన, శ్రాద్ధవిస్తరంబు సలుప నేల. 2345

మ. అని గంభీరముగా వచించుటయుఁ దద్వ్యాహార మాలించి యే
మనఁగన్ దోఁపమి నప్డు రాఘవుఁడు చింతాక్రాంతుఁడై శంభునిన్
గన నాతండు నిజాంగనన్ గనుడు నాకంజాక్షి యేతెంచె గ్ర
క్కునఁ జేతం బరమాన్నభాజనముఁ జిక్కంబట్టి వడ్డింపఁగన్. 2346

క. అరుదెంచినయామెను గని, పరమానందమున నతిథి పాణిని జాఁపన్
దరుణీమణి వడ్డించెను, బరమాన్నము నక్షయముగ భావించి మదిన్. 2347

గీ. అట్లు వడ్డింపఁ బరమాన్న మావధూటి
బ్రాహ్మణుఁడు జుఱ్ఱి జుఱ్ఱుచుఁ బైనిఁ గనుచు
శిరము ద్రిప్పుచు మెచ్చుచు మరలఁ జాఁచె
హస్తమును నది చూచి యి ట్లనియె నామె.

గీ. స్వామి పాయస మెల్ల హస్తంబునందు, పొరలిపోవుచు నున్నది మరల నేల
చాఁచితివి కేలు త్రాగుము సత్వరంబ, తృప్తి గలుగంగ వడ్డింతు నెంత యేని.

క. అనవుడు విప్రుఁడు తనకర, మున నుండినపాయసాన్నమును ద్రావి కమం
గొని మరల నుంచు నది కర, మున నె మరలఁ ద్రావ మరలఁ బూర్తిగ నుండెన్.

క. అది యంతయు నాశ్చర్యం, బొదవింపఁగ మదికి బ్రాహ్మణోత్తముఁ డిఁక ని
య్యది గాదు మార్గ మమకొని, యత వేఁగక యుండ నాముహస్తముఁ జాఁచెన్.

గీ. అప్పు డది చూచి యాసాధ్వి యాత్మలోనఁ
బూర్వ మట్టులె భావించి పోసె నతని

హస్తమునఁ బాయసము నది యారగించి
తఱుఁగ కుండుటఁ గాంచి యాధరణిసురుఁడు. 2352

గీ. సృష్టి గావించుకొని యొక చేయి మరలఁ, జాఁచుటయుఁ బోసె మునుపోలె సారసాక్షి
యదియువదలక యుండుట హస్తమందు, మఱియొక కరంబుఁ జాఁచి క్షమాసురుండు.

గీ. ఇంతి యర్పింపు మిందులో ఘృతము ననుడు
నామె మునుపోలెఁ దలఁచి యాజ్యంబు వోసె
నదియు నక్షయ మగుటయు నవనిసురుఁడు
పాణి మఱియొండు చాఁచి సూపంబు నడిగె. 2354

గీ. అంత నాసాధ్వి మునుపోలె నక్షయముగఁ
దలఁచి సూపంబు నతనిహస్తమున నుంచె
నదియుఁ దఱుఁగక యుండుట హస్తమందుఁ
గ్రమముగ నతండు కరసహస్రంబుఁ జాఁచి. 2355

గీ. తుదకు విఫలప్రయత్నుఁడై తోయజాక్షి, వలదు నా కింక నేమియుఁ గలిగెఁ దృప్తి
సీతచేఁ గాదు రామునిచేతఁ గాదు, తర్పితుఁడ నైతి నీచేతఁ దథ్యముగను. 2356

గీ. అని వచించుటయును శంభుఁ డతనిఁ జూచి
యింతకును దృప్తి గలిగెన యెఱుఁగఁ జెప్పుమ
అతివ యొకతయ కాదు సీతమయు నేను
రాముఁడును నిచ్చినట్టివారలము చూవె. 2357

క. అని యడుగుటయును ద్విజుఁ డి, ట్లనియెను దృప్తుండ నైతి నధికంబుగ నా
కొనగూడి యీ పదార్థము, పెనుబూతముపోలె విడిచిపెట్టదు నన్నున్. 2358

చ. అనయము భోజనంబుకొఱ కయ్యెను నాకరజాల మెల్ల నే
నొనరుప వీలులేదు మఱియొక్క క్రియన్ బని లేనిపాటు గాఁ
గను నిట కేఁగుదెంచి యొకకర్మ మిటుల్ గొని తెచ్చుకొంటి నా
మనమున నెట్లు తోఁచినదొ మానక యట్టులె యయ్యె నంతయున్. 2359

క. అవుఁ గాక యేమి చేయఁగ, నవు నిప్పుడు మీఁదికర్జ మతిశీఘ్రముగన్
సవరింపుఁడు భుక్తాయా, సవశుఁడ నై నేను నిలువఁజాలక యుంటిన్. 2360

వ. అని పలికి చేతులలోనిపదార్థంబు మే నంతయుం బట్టించి రుద్దుకొనుచుండ
రామచంద్రుండు బ్రాహ్మణులకు నుత్తరాపోశనం బొసంగె. 2361

గీ. అంత నాపోశనజలంబు నారగించి, యవల నుచ్ఛిష్టపాత్రములందు నర్హ
విధిని గండూష మొనరించి విప్రు లెల్ల, లేచి పోయిరి యతిథి తా లేవఁ డయ్యె.

సీ. అది చూచి రాముఁ డిట్లనియెను స్వామి లే, వక యుంటి వేమి కావలెనొ నీకు
సెలవిమ్ము నావుడు క్షితిసురవర్యుఁడు రామ, యేమియు వలదు సంతృప్తి యయ్యె

నీవు పెట్టినభుక్తి యెక్కువ యగుటను, లేవఁ డీయుక యున్న లేతఁ జాల
నవుటయు రాఘవుం డతనిచేతులు చిక్కఁగ బట్టి లేపఁగ లేక యట్టె నిలిచె

గీ. నంతటను వాయునందనుం డరుగుదెంచి, లేవ నెత్తంగ యత్నించి లేవ కునికి
వాలమున జుట్టి లాగంగ వసుధ యెల్ల, వణఁకుచున్నను విప్రుఁడు తొణఁకఁ డయ్యె.

గీ. అంతటను బాహుమూల ధాత్రి వణఁగఁ ద్రొక్కి, పండ్లు బిగఁ బట్టి లాగె నాపవనసూతి
తోఁక బలిమిని బీరంబుతోడఁ గూడఁ, గదలి వెలుపలఁ బడియె నాత్మారకుండు,

ఆ. అపుడు జాంబవంతుఁ డతనిఁ బీఠంబునఁ, గూరుచుండఁ బెట్టి నీరు వోయ
నొడలు గడిగి సీతయును లక్ష్మణుండును, నాచమింపఁ జేసె రధికభక్తి. 2365

ఆ. అంత నాచమించి యాతఁడు లేవంగఁ, జాల కునికి నెఱిఁగి జాంబవంతుఁ
డతనిఁ దనభుజంబులం దుంచుకొని పోయి, దించె దివిరి శ్రాద్ధదేశమందు.

వ. అంతట రామచంద్రుండు బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణంబు గావించి తదాశీర్వా
దంబులం బడసి భుక్తాయాసంబు నొందుచుండు నతిథిసన్నిధికి సతీభ్రాతృసహి
తంబుగాఁ జేరి. 2367

—: హరిహరాదులు రామచంద్రునకుఁ బ్రత్యక్షమగుట :—

సీ. సీతను దత్పాదసేవకై నియమించి, యాచరించుచు నుండ నామె యట్లు
ముదువఁ దన్మర్దనంబుల లక్ష్మణున కాజ్ఞ, చేసి యాతం డట్ల చేయుచుండ
వీవన నతనికి విసరంగ భరతు నా, జ్ఞాపించి యతఁ డట్ల సలుపుచుండ
సెలవిచ్చి తుదువఁ దచ్ఛ్లేష్మంబు శత్రుఘ్ను, నకు నతం డట్ల నొనర్చుచుండఁ

గీ. దత్కరంబుల నొత్తుచుఁ దాను నిలువ
నప్పు డతిథి రాజీవదళాక్షుఁ డగుచు
శంభుఁ డీశ్వరుఁ డగుచుఁ దత్సతి మృడాని
యగుచు నిలిచిరి యెదుట నత్యద్భుతముగ.

గీ. అంత రాముఁడు పులకాంకితాంగుఁ డగుచు
మ్రొక్కి సాష్టాంగముగ వారిముందు నిలిచె
నంత నిలిచిరి వందనం బాచరించి
తత్సతియుఁ దత్సహజులు నాతండువోలె. 2369

గీ. అప్పుడు ప్రసన్నులై హరిహరులు శివయుఁ, గరుణ వెలయంగ వారి నెల్లరను గాంచి
కోరుకొమఁ డిచ్చువారము కోరినట్లు, వరము లెన్నియును మీకు వాంఛ దీర.

క. అనుటయు రాముఁడు హర్షం, బెనయఁగ దత్పాదభక్తి యెపుడును మదిలోఁ
దనరారఁ గోరె వరమును, ననుజన్ములు సతియుఁ గోరి రట్టులె వెంటన్. 2371

క. అంతట నాముప్పురుడున ద, దంతశ్శుద్ధికి బ్రమోద మందుచును నిర
భ్యంతరముగ నిచ్చి వరం, బంతర్ధానంబు నొంది రతిశీఘ్రముగన్. 2372

గీ. అపుడు రాముఁడు బంధుమిత్రాదిసహితుఁ
డగుచు భుజియించి యవల దీనాంధకృపణ
జనులకు నొసంగి మృష్టాన్నమును సమస్త
జనులు గీర్తింప రాజ్యంబు చలుపఁ దొడఁగె. 2373

—: పాతాళఖండపఠనశ్రవణఫలకథనము :—

క. పాతాళఖండ మియ్యది, చేతోహరముగను దీనిఁ జెప్పెడివారల్
శ్రోతలును విగళితాఖిల, పాతకు లయి హరిపదంబుఁ బడయుదురు తుదిన్.

వ. అని చెప్పుటయును శౌనకాదిమహర్షిబృందం బమందానందభరితం బయ్యె.

క. సృష్టిస్థితిసంహార, స్పష్టీకృతనిజమహేశభావ సదాసం
తుష్టాంతరంగ భక్తా, భీష్టప్రద విశ్వనాథ యిష్టసనాథా. 2376

నారాచవృత్తము

నారాయణప్రియా శర
ద్ధారాధరాభవిగ్రహా
గౌరీసతీమనోహరా
వారాణసీపురాధిపా. 2277

గద్యము

శ్రీ చిదంబరకవీంద్రప్రణీతం బైన శ్రీమదాంధ్రపద్మపురాణంబునఁ
పాతాళఖండము
సమాప్తము.




శ్రీ కాశీవిశ్వేశ్వరార్పణమస్తు.



# శతావధాని, శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రికృతగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమదాంధ్రపద్మపురాణము (ప్రథమసంపుటము) | క్యాలికో బైండు | 8–0–0 |
| | ,, ,, ,, | అట్టబైండు | 7–0–0 |
| | ,, ,, (ద్వితీయసంపుటము) | క్యాలికోబైండు | 4–0–0 |
| | ,, ,, ,, | అట్టబైండు | 3–0–0 |
| | (ముందుగా ద్రవ్యమిచ్చినవారికి) నాలుగుసంపుటములు | | 25–0–0 |
| 2. | హైమవతీ విలాసము (ప్రబంధము) | | 0–8–0 |
| 3. | కపోత కిరాతము ,, | | 0–6–0 |
| 4. | శ్రీరామాంజనేయము (నాటకము) | | 0–12–0 |
| 5. | శ్రీకృష్ణసందేశము ,, | | 0–12–0 |
| 6. | భారతీయ ప్రబోధము (నేఁటిపరిస్థితుల విమర్శించుపద్యకావ్యము; | | 0–4–0 |
| 7. | పీఠికాపుర శతావధానము | | 0–4–0 |
| 8. | నవాబుపేఁట శతావధానము | | 0–4–0 |
| 9. | బెజవాడ శతావధానము | | 0–4–0 |
| 10 | రాజసభావిహారము (అచ్చు కావలసినది) | | |
| 11. | పంచాయతన పంచశతి (సంస్కృతము) | | 0–12–0 |
| 12. | రాజధర్మకావ్యము ,, (అచ్చుకావలసినది)<br>విద్వాన్, పి. విశ్వేశ్వరశాస్త్రికృతజయవ్యాఖ్యాసమలంకృతము | | |
| 13. | శ్రీరత్నపాంచాలిక (శ్రీసర్వజ్ఞసింగభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి)<br>విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతము | | 1–8–0 |
| 14. | ప్రద్యుమ్నాభ్యుదయము (శ్రీరవివర్మభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి)<br>విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతము (అచ్చు కా వలసినది) | | |
| 15. | దూతవాక్యము (భాసకృతి కాంధ్రీకృతి – అచ్చు కా వలసినది)<br>విద్వాన్, పిసుపాటివిశ్వేశ్వరశాస్త్రి కృతము | | |
| 16. | పాణినీయము - కావ్యవాఙ్మయము<br>వ్యా. వి, ప్ర; ఉ. భా. ప్ర. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | 1–8–0 |
| 17. | శంకరవిజయము (గద్యము) విద్వాన్, పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | 0–12–0 |
| 18. | అవధానాదర్శము. (సంస్కృతము)<br>విద్వాన్ పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతవ్యాఖ్యాసంకలితము | | 0–2–0 |
| 19. | మాయావిలాసము. (ప్రబంధము – అముద్రితము)<br>విద్వాన్, పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతము | | |

ప్రాప్తిస్థానము

**విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి.**

ఆంధ్రాధ్యాపకుఁడు

వేంకటగిరిరాజకళాశాల

నెల్లూరు.